శ్రీరస్తు.

# కాదంబరీ కథాసారము.

ఇది

## చేవలి సుబ్రహ్మణ్యశాస్త్రి

విరచితము.

శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలయందు
అచ్చువేయించి
ప్రకటించె.

మొదటికూర్పు ౧౦౦౦.



వెల రు ౦-౨-౦.

PRINTED AT THE S. S. M PRESS, VIZAG. 1904.

# భూమిక.

ఈగ్రంథము ముఖ్యముగాఁ గాదంబరినిగూర్చి చెప్పునదగుటచేఁ గాదంబరి యనఁబడు. ఇందలికథ పురాణంబులఁగనఁబడమిచేఁ గల్పితమనితోఁచు. ఇది రెండు భాగంబులు గలది. అందుఁ బూర్వభాగంబు భట్టబాణునిచేతను, ఉత్తరభాగంబు తత్పుత్రునిచేతను జేయఁబడె. అతనిపేరు దెలియదు. భట్టబాణుఁడు హర్షచరితంబుఁ గూడ రచియించె. పైగ్రంథద్వయంబును కల్పనా కాఠిన్యముల కాస్పదంబు. మొదటిది, సంస్కృతంబున నున్న గద్యగ్రంథములలోఁ బెద్దది.

భట్టబాణుఁడు మఱియొకఁడు గలఁడు. అతఁడు ఉషాపరిణయ నాటకమును, పార్వతీపరిణయ నాటకమును, శృంగారభూషణ భాణంబునను మూఁడు గ్రంథములు చేసెను. ఉషాపరిణయ నాటకమున "పద్యేపటీయాన్కిల కాళిదాసో గద్యేపటీయా

న్కాలభట్టబాణః। పద్యేచ గద్యేచ పరం పటీయాన్వా
త్స్యాయనో వామనభట్టబాణః" (పద్యకవితయం
దుఁ గాళిదాసుఁడును, గద్యకవితయందు భట్టబా
ణుఁడును, ఆయుభయకవిత్వమునందు వాత్స్యాయ
నుఁడగు వామన భట్టబాణుఁడును, మిక్కిలి సమర్థు
లు) అనియుండుటనుబట్టి కాదంబరీకర్త కాళిదాసుకం
టెను బ్రాచీనుఁడో, సమకాలికుఁడో యనియు, వా
మన భట్టబాణుఁడు వారికంటె నర్వాచీనుఁడని
యుఁదేలు.

మఱియు చంద్రాపీడ వైశంపాయనులకును, క
పింజల పుండరీకులకును, కాదంబరీ మహాశ్వేతలకు
ను మిగుల సఖ్యంబుగలదు. వారిలో మహాశ్వేతా
శాపమువలన వైశంపాయనుఁడు మృతుఁడగుట విని
చంద్రాపీడుఁడు మృతినొందుటయు, మహాశ్వేతా
వియోగము సైఁపక పుండరీకుఁడు మృతినొందుట
ను జూచి కపింజలుఁడు లోకాంతరమునకు సయిత
ము వెళ్లుటయును, మహాశ్వేతా వివాహమునకు వల

కుఁ గాదంబరి పెండ్లి మానుకొనుటయును, గురుజ నంబు నతిక్రమించుటచేఁ గపింజలుఁ డింద్రాయుధం బను నశ్వంబగుటయును, అవినయంబుచేఁ బుండరీ కుఁడు పూర్వజన్మవాసనతో వైశంపాయన శుకజ న్మంబుల నొందుటయును సంభవించె. దానింబట్టి వి చారింప నీకథయవిచ్ఛిన్నమిత్రత్వంబును, పునర్జన్మం బును, తజ్జన్మసంస్కారంబును ముఖ్యముగా బోధిం చుచున్నది.

కాదంబరి కథ దురవగాహంబుగ నుండుటచేఁ దాని సంగ్రహించి కాదంబరీ కథాసారమని పేరుఁ బెట్టి సులభముగఁ దెలుఁగున గద్యమయముగా వ్రా సినాఁడను.

| | |
|---|---|
| విశాఖపట్టణము.<br>1-12-1904. | చేవలి సుబ్రహ్మణ్యము.<br>సంస్కృతపండితుఁడు.<br>లండన్ మిషన్ హైస్కూల్ |



## ఈకథయందు వచ్చు స్త్రీపురుషులు.

అరిష్ట=శకుని రెండవ కుమార్తె.

ఇంద్రాయుధము=చంద్రాపీడుని యశ్వంబు. ఋషి శాపముచేఁ గపింజలుఁడు గుఱ్ఱమయ్యె.

కపింజలుఁడు=ఒక ఋషి. పుండరీకుని మిత్రుఁడు. ఋషి శాపముచేఁ జంద్రాపీడుని వహించు నింద్రాయుధమను నశ్వంబయ్యె.

కాదంబరి=మదిరా చిత్రరథుల పుత్రిక. నాయిక.

కుమారపాలితుఁడు=శూద్రకుని మంత్రి.

కేయూరకుఁడు=కాదంబరి సేవకుఁడు.

గౌరి=హంసుని భార్య. మహాశ్వేతకుఁ దల్లి.

చండాలకన్య=చిలుకను దెచ్చిన స్త్రీ. బోయత.

చంద్రాపీడుఁడు=తారాపీడుని కుమారుఁడు. కథానాయకుఁడు. పుండరీకుని శాపముచేఁ జంద్రుఁడు చంద్రాపీడుఁడాయె. ఇతఁడు వైశంపాయ

నుఁడు చనిపోయిన సమాచారము విని చనిపో
యి తాను శూద్రకుఁడుగాఁ బుట్టె.

చిత్రరథుఁడు=దక్షసుతకును మునికిని బుట్టెను. గం
ధర్వుఁడు. భార్య మదిర. కూఁతురు కాదంబరి.

జాబాలి=ఒకఋషి. త్రికాలజ్ఞుఁడు. పుత్రుఁడు హా
రీతుఁడు. వారియాశ్రమమునందుఁ గొంతకాల
ము చిలుక యుండె.

తరళిక=మహాశ్వేత దాసి.

తాంబూలకరండవాహిని= పేరు పత్రలేఖ. తాం
బూలమునిచ్చుస్త్రీ. చంద్రాపీడుని సేవకురాలు.

తారాపీడుఁడు=ఉజ్జయని నగరమునకు రాజు. భా
ర్య విలాసవతి. కుమారుఁడు చంద్రాపీడుఁడు.

త్వరితకుఁడు=చంద్రాపీడుని యనుచరుఁడు.

పత్రలేఖ=చంద్రాపీడుని సేవకురాలు. రోహిణి
యై పుట్టె.

పుండరీకుఁడు= ఒకఋషి. కపింజలుని పుత్రుఁడు.

చంద్రుని శాపముచే వైశంపాయనుఁడయ్యె.

మదలేఖ=కాదంబరిదాసి.

మదిర=గంధర్వస్త్రీ. చిత్రరథుని భార్య. కాదంబరికిఁ దల్లి.

మనోరమ=శుకనాసుని భార్య. పుత్రుఁడు వైశంపాయనుఁడు.

మహాశ్వేత=గౌరీహంసుల పుత్రి. మారుపేరు హంసి. కాదంబరికి సఖి. పుండరీకుని బ్రేమించె.

మేఘనాదుఁడు=వలాహకుని కుమారుఁడు.

వలాహకుఁడు=సేనాధిపతి. పుత్రుఁడు మేఘనాదుఁడు.

విలాసవతి=తారాపీడుని భార్య. కొడుకు చంద్రాపీడుఁడు.

వైశంపాయనుఁడు=శుకనాసుని పుత్రుఁడు, చంద్రాపీడుని ముఖ్యమిత్రుఁడు. ఇతఁడు పూర్వజ

ర్వజన్మమునఁ బుండరీకుఁడు. మహాశ్వేతశాపముచేఁ జిలుకయయ్యె.

శుకనాసుఁడు=తారాపీడుని మంత్రి. వైశంపాయనుని తండ్రి.

శూద్రకుఁడు=విదిశానగరమునకు రాజు. ఇతఁడు పూర్వజన్మమునందు జంద్రాపీడుఁడు.

శ్రీ=లక్ష్మి. శూద్రకుని దగ్గఱకుఁ జిలుకను దెచ్చిన చాండాలి. పూర్వజన్మమునఁ బుండరీకుని తల్లి.

శ్వేతకేతువు=ఒక దేవర్షి. ఇతనికిని, పద్మవనలక్ష్మికినిఁ బుండరీకుఁడు పుట్టె.

హంసి=మహాశ్వేతకు మాఱుపేరు.

హంసుఁడు=ఒక గంధర్వుఁడు. భార్య గౌరి. అతని పుత్రి మహాశ్వేత.

హారీతుఁడు=జాబాలి పుత్రుఁడు. వారి యాశ్రమమందుఁ గొంతకాలము చిలుక యుండె.



శ్రీ ర స్తు.

# కాదంబరీకథాసారము.

## పూర్వకాదంబరి.

లవదేశంబునందున్న వేత్రవతీతీరమునందు వి
శ పట్టణం బొకటిగలదు. దాని శూద్రకుఁడ
పాలించుచుండె. అతఁడంతఃపురస్త్రీవిర
మిత్రబృందముతో శాస్త్రగోష్ఠివినోదంబునఁ
బుచ్చుచుండె. అంత నొకనాఁడు సూర్యో
మనఁ బ్రతీహారివచ్చి యో రాజోత్తమా! ద
థమునుండి యనుచరునితోఁ జండాలకన్య
త పంజరముతోఁ జిలుకనుఁ బట్టుకొనివచ్చి
మన మహాలక్ష్మివలె నున్నదని చెప్పె. ఆమా
రాజు సంతోషించి తప్పేమి? యని రా నెల
రాజు దానిసౌందర్యముఁజూచి కూర్చుండు

మని చెప్ప దాని యనుచరుండు పంజరములోని వై
శంపాయనమను శుకమును రాజునెదుటఁబెట్టి తను
సన్నిధినుండఁదగినదని నాప్రభుపుత్త్రికి యుపాయ
నముగ సమర్పించెనని సారముగా వెల్లై. ఆశుకము
రాజుతట్టుతిరిగి కుడికాలెత్తి జయయని ముందుగఁ
బఠికి పిమ్మట "కన్నీళ్లతో స్నానము సేయునట్టియు
నిత్యము శోకాగ్ని చేఁగాఁగుచునట్టియు నీశత్రుకాంత
లు విముక్తాహారలగుచున్నారు" అని నృపునిఁబ్రశం
సించె. రాజు దాని విని చెంతనున్న కుమారపాలితుఁ
డను మంత్రితోనిట్లనియె. ఈపక్షి వాగ్వైఖరి వింటి
వికదా. పూర్వజన్మజ్ఞానముంబట్టి కాని యిట్టిశక్తిల
భింపదనుచుండ మధ్యాహ్నమయ్యె. రాజవల్లభుఁ
డు సభ్యులకును, చాండాలకన్యకును సెలవిచ్చి యా
కీరంబును దాంబూలకరండవాహినికి నొప్పగించి
తా నాహ్నికము దీర్చుకొనవెళ్లి పరివారముతోఁ దరి
గి యాస్థానమండపమునకు వచ్చె. అంతిపురంబు
నుండి చిలుకను రావించె. నీవెవతెవు? నీపుట్టువేమి?

యని రాజునకు నదియిట్లనియె. ఓ రాజోత్తమా! కథ పెద్దదయినను జెప్పెదవినుమని మొదలుపెట్టెను.

వింధ్యాటవియందు దండకారణ్యములోఁ గావేరీతీరంబున నగస్త్యాశ్రమం బొండుగలదు. తత్సమీపమునఁ బంపయను సరస్సుగలదు. అచ్చటనున్న చెట్టుతొఱ్ఱలోఁ దల్లిలేనిపిల్లనై యుంటిని. నాతండ్రి నన్నుఁ బోషించుచుండెను. ఒకనాఁ డొకశబరుఁడు వచ్చి నాతండ్రి మొదలయినవారిని వేఁటాడి చంపె. దైవయోగంబున నేను బ్రదికివచ్చి దప్పినొంది మూర్ఛిల్లితిని.

అంత జాబాలితనయుండైన హారీతుఁడు స్నానమునకు వెళ్లుచు నన్నుఁ దీసికొని పద్మసరస్సునకు వెళ్లి తాను స్నానముచేసి నాకు నీరువట్టి యాశ్రమమునకుఁ దిరిగి తీసికొనివచ్చెను. జాబాలి నన్నుఁజూచి మునులతో నిది దీనియవినయఫలము ననుభవించుచున్నదని చెప్పె. వారది యేమనియడుగ నతఁడిట్లనియె. అవంతిదేశమున నుజ్జయనీనగరమునందుఁ

తారాపీడుఁడను రాజు గలఁడు. అతని భార్య విలాసవతి. మంత్రి శుకనాసుఁడు. మంత్రి భార్య మనోరమ. రాజమంత్రులు సంతతిలేక వ్రతములు సేసిరి. పిమ్మట నొకనాటిరాత్రి రాజు తనభార్యనోటఁ బూర్ణచంద్రమండలము ప్రవేశించినట్లును, మంత్రియగు శుకనాసుఁడు తనభార్యయొడిలో వికసించిన పుండరీకం బుంచఁబడినట్లును, గలఁగని మఱునాఁటి యుదయమున నొండొరులు స్వప్నమును గూర్చి చెప్పుకొనిరి. పదంపడి మనోరమా విలాసవతులు గర్భమును ధరించిరి. ఒకదినమునందె కుమారులను గనిరి. రాజపుత్రునకుఁ జంద్రాపీడుఁడనియు, మంత్రికుమారునకు వైశంపాయనుఁడనియుఁ బేళ్లు వెట్టిరి. పుట్టినది మొదలు రాజమంత్రుల పుత్త్రులు మిత్రులుగానుండిరి. ఐదవయేట నక్షరాభ్యాస మిర్వురికిని జేసి వ్యాకరణాదివిద్యలఁ గఱపఁదగిన యుపాధ్యాయుల నొప్పగించి బడికిఁ బంపిరి. వారు చతుష్షష్టికళలును, చతుర్దశవిద్యలును నేర్చిరి. రాజు విద్యాసంపూర్తియైనకు

మాత్యునిం గని సేనాధిపతియైన వలాహకుని నింద్రా యుధంబను నశ్వరత్నంబును బనుప నాగుఱ్ఱము నెక్కి వైశంపాయనునితో రాజకుమారుఁడు రాజమందిరమునకు వచ్చె. తారాపీడుఁడు మంచిదినమునఁ దన కుమారుని యువరాజుగా నేర్పర్చి మంత్రికినొప్పగించి నీతిని నేర్పించెను. అతఁడు యువరాజయి రాజ్యమును బాలించుచుండఁగాఁ దల్లియగు విలాసవతి, పత్రలేఖయనుదానిఁ దాంబూలకరండవాహినిగా నొప్పగించె. అతఁడు దానిని దయతోఁ జూచుచుండెను. ఒకనాఁడు పత్రలేఖను, వైశంపాయునిని, రాజకుమారులను వెంటఁబెట్టుకొని యింద్రాయుధంబెక్కి దిగ్విజయమునకు నేగె. నలుదిసల రాజులను లోబర్చికొని వారివలన బహుమానములను బొంది జయస్తంభములను నిల్పి కైలాససమీపముననున్న సువర్ణపురమున విడిసె. దిగ్విజయముఁ జేయ మూఁడేండ్లు పట్టె. ఒకనాఁడింద్రాయుధమ్ము నెక్కి యొంటరిగా నరణ్యమునకు వెళ్లి వేటాడుచుఁ గిన్నర

ద్వంద్వమును జూచె. దానిఁ బట్టఁదలఁచి గుఱ్ఱము మీఁదవడిగా వెళ్లఁగా జేతికి దొరకినట్లయి యదిగడు దూరము దీసికొని వెళ్లి మాయమయ్యె. అంతఁడు దప్పిఁగొని జలాశయము వెదకుచు నచ్ఛోదసరస్సును జూచి, అందు గుఱ్ఱమునకు నీరు నెట్టి, తానును నీరు ద్రాపి యొడ్డునఁగూర్చుండి యుండఁగా గానము వినఁబడె. మరల నశ్వంబెక్కి శబ్దముఁబట్టి యుత్తర దిక్కునకేగి సిద్ధాలయమును, అందుఁజంద్రశేఖరుని సేవించుచున్న షోడశవర్షదేశీయురాలును, గంధర్వకన్యయునగు మహాశ్వేతను జూచె. దానిరూపునకచ్చెరువొంది పాటయగువఱకునుండె. ఆమె చంద్రశేఖరునకుఁ బ్రదక్షిణ నమస్కృతులొనర్చి వెళ్లఁబోవునపుడు చంద్రాపీడునిఁ జూచి 'ఓ మహాత్ముఁడా! నాయింటికివచ్చి యతిథిపూజగొనుము', మనఁగా నతఁడామెతో గుహకేగి పూజవడసి సుఖముగనుండె. ఆమె సంధ్యోపాసనాదికము దీర్చికొని 'నీసమాచారమేమి?' యని యడుగ గుఱ్ఱమెక్కినది మొదలు

కొని కిన్నరమిథునమును జూచిన వఱకు జరిగిన వృత్తాంతముఁ జెప్పె. అంతనతఁడు నీవృత్తాంతంబేమి? పలయిట్లు మునివ్రతమాచరించుచుంటివని యడుగ నిమేషమాత్రము ధ్యానించి విచారంపడి ధైర్యము తెచ్చికొని కన్నులఁదుడిచికొని ఓరాజపుత్రుఁడా! నిర్భాగ్యురాలనైన నావృత్తాంతముతో నీకేమిపని? ఐనను గోరితివిగానఁ జెప్పెద. స్వర్గమున గంధర్వాప్సరః కులంబులు పదునాలుగున్నవి. అందు దక్షసుత కును, మునికిని గంధర్వుఁడగు చిత్రరథుఁడు పుట్టె. వానిభార్య మదిర. వారిపుత్రిక కాదంబరి. అతఁడు గంధర్వులకు రాజు. హేమకూటగిరియందు వసించి చైత్రరథవను క్రీడోద్యానమును, అచ్ఛోదమను సరస్సునుగల్పించెను. దక్షుని రెండవ పుత్రియైన నరిష్ట హంసునిగనె అతనిభార్యగౌరి. అతఁడు కింపురుషవర్షమునఁ జిత్రరథుని చేత నభిషిక్తుఁడై హేమకూటగిరియందు గౌరితోవసించె. నేను వారికూఁతురను. నాపేరు మహాశ్వేత. కాదంబరికిని నాకును మిక్కి—

లి స్నేహితులము. ఇద్దఱము సంగీతము నేర్చుకొంటిమి. నావిచారముంబట్టి నా పెండిలిగుఱించి వలదు నాకు పెండిలి జేసి కొననని ప్రతిజ్ఞ జేసె. ఒకనాఁడు నా తల్లిగారైన గౌరితోఁ నచ్ఛోదసరస్సునకు వచ్చితిని. నా తల్లి స్నానము సేయుచుండ నేను సఖియగు తరళికతో నాసమీపమున సంచరించుచు గాలికివచ్చిన తావినిమూర్కొని యామవాసనంబట్టి వెళ్లి పారిజాతపుష్పమును జెవిఁబెట్టికొనియున్న యష్టాదశవర్షదేశీయుఁడగు మునిపుత్రుంజూచితి. చూడఁగా చేనాంగోరులకు రక్తిగలిగె. అతని సఖుఁడైన కపింజలునిఁజూచి 'ఓమహాత్ముఁడా! ఇతనివృత్తాంతమేమి? పూవెక్కడిది? యనియడుగ నతఁడు నవ్వి యింతవలన నీకేమిలాభము? అయినను జెప్పెదవినుమని ఓయింతీ! శ్వేతకేతువను దేవఋషి మందాకినికిఁ బోవుచుండ నతనిఁ బద్మవనలక్ష్మి మోహించి వెంటనె పుండరీకవనంబునఁ బుత్రునిగని తెసికొనివచ్చి యిదిగో నీకుమారుఁడని తండ్రికి నప్పగించె. అతఁడు పుత్రునకుఁ

బుండరీకుఁడని పేరు వెట్టి యుపనయనాదికము సేసి, సకలవిద్యలను నేర్పెను. పుండరీకుఁడు చంద్రమాళిని(జూడ గోరి రాఁగా వానికి నందనవనలక్ష్మి యి ప్పారిజాతము నిచ్చె ననిఁ చెప్పె.

'ఈ కుటిలప్రశ్నచే నేమి లాభము? అది పుండరీకుఁడు విని నీకు గావలసినయెడలఁ గైకొనుము' నిత న చెవినుండి పూవుదీసి నా చెవి నిడునపుడు చెక్కిలికి నతని వ్రేలు దాఁకఁగా నిరువురకును మోహము పుట్టె. అతనికిఁ దెలియకయె చేతినుండి యక్షమాల జారుచుండఁగాఁ గ్రిందపడకుండఁ గైకొని ధరించితిని. అంత నాయక్షమాల యియ్యకుండ వెళ్లవద్దనఁగా నాముత్యాలహారము నిచ్చితిని. అది యక్షమాలయె యని పుచ్చుకొనెను. నా తల్లి పిలుచుచున్నదని సఖి చెప్పఁగా నే నామెతో నింటికి వెళ్లితి.

ఆముని పుత్రుఁడు చెట్టుపట్టాపెఁ దమాలరసముం తో " తామరతూఁడువలెఁ దెల్లనగుముత్యాలహారముచే నాశ పెట్టఁబడిన నామనస్సు హంసవలె నీ

చేఁగొనిపోఁబడె" అనిపత్రిక వ్రాసి నాసఖియగు త
రళికచేఁ బంప నది నేనొంటరిగా నున్నపుడు తెచ్చి
యిచ్చె. అంత నే నాపత్రికఁ జదివి యామునిపుత్రు
నిఁ దలంచుచు హార్మ్యంబెక్కి యొంటరికత్తెనై వి
రహాము నైఁపలేకుంటిని. అంతఁ జంద్రోదయ మగు
చుండఁ బుండరీకుని మిత్రుఁడయిన కపింజలుఁడు చే
తులు జోడించుకొని దగ్గఱకువచ్చి నాతో నిట్లనియె.
ఓగంధర్వపుత్రీ! మహాశ్వేతా! నిన్నుఁ జూచినది
మొదలు నామిత్రుఁడగు పుండరీకుఁడు కామవశం
వదుఁడై యున్నాఁడు. నేఁజేసిన శీతలోపచారము
లు విఫలములయ్యె. నిన్నుఁజూచిన యెడల జీవించు
ను. లేనియెడలఁ జనిపోవును. మునిపుత్రునిఁ బ్రతికిం
పఁగోరుదేని రమ్మని చెప్పెను. అందుకు నేనేమిచె
ప్పుటకుఁ బాలుపోక చింతించుచుండఁగా నాతల్లియు
చ్చ్రటికివచ్చి నాతోఁజెప్పకయె వెళ్లెను. అప్పుడునే
ను సఖితోను కపింజలునితోను వెళ్లుచుఁ బుండరీకు
నియందుఁ దగిలిన మనస్సుగలదాననగుచు వెళ్లునం

తలో మునికుమారుఁడు మన్మథతాపము సైఁపమిఁ
బ్రాణముల విడిచిపెట్టెను. అట్టిస్థితినిఁ జూచి యే
డ్చి యేనును గూడ నసువులఁ గోల నైతిని. ఒకదివ్యపురు
షుఁడు చంద్రమండలంబునుండి దిగివచ్చి 'ఓమహా
శ్వేతా! యేడువకుము, తిరిగియితనితో నీకుసమాగమ
మగున'ని నన్నునోదార్చి మునిపుత్రునిం జంద్రమం
డలమునకుం దీసికొనిపోయె. కపింజలుఁడు విడువి
డుమని యాదివ్యపురుషుని వెంబడించెను. నేను
జూచుచుండఁగా వారు చంద్రమండలముఁ జొచ్చి
రి. నాప్రాణేశ్వరుం దిరిగి కలయుకోరికతో జీవము
లఁ బాయక చంద్రశేఖరుని నారాధించుచు నప్ప
టినుండియు నీసిద్ధాలయమున నున్నదానననిత నవృ
త్తాంతము చెప్పి తిరిగి యేడువ మొదలువెట్టె.

చంద్రాపీడుఁడు నామె నోదార్చి మిగిలిన రా
త్రి వెళ్లఁబుచ్చె. ఉదయమున నతఁడును మహాశ్వేత
యును స్నానము సేసి నిత్యకృత్యములు దీర్చికొని
యుండఁ గాదంబరి దగ్గఱనుండి కేయూరకుఁడును,

తరళికయును వచ్చిరి. రాఁగా, 'ఓతరళికా! కాదంబరి పెండ్లినిగూర్చి యేమిజరిగెన'ని మహాశ్వేత యడుగఁ గేయూరకునకుఁ దెలియునని యదిచెప్పె. కేయూరకుఁడు. 'ఓ మహాశ్వేతా! నీవు లేనందునఁగాదంబరి స్వల్పసుఖమును గూడ గొప్పదుఃఖముగాఁ దలంచుచున్నపుడు పెండ్లిని లెక్కించునా? ఇంతియొకాక నింటనుండుటయె తప్పని యెంచుచున్నది. ఏమిచెప్పెద!' అని యూరకుండె. అంతనామె, 'ఓ కేయూరకుఁడా! వెంటనే యచ్చటికి వెళ్లు. నేనును నీవెంటనేవచ్చి సఖిని జూచెదన'ని కేయూరకునినంపి రాజునుజూచి ఓరాజా! గంధర్వరాజధానిని, అందున్న కాదంబరినిఁ జూడఁగోరినచో నాతోరమ్మని చెప్పెను. రాజు నామెయు బయలుదేఱి తిన్నగా హేమకూటమునకు వెళ్లి గంధర్వ రాజధానిని జూచి కన్యాంతఃపురమును బ్రవేశించిరి.

కాదంబరి కేయూరకునివలన మహాశ్వేతరాక తెలిసికొని లేచి శ్రీమండపమున మహాశ్వేతతోఁడా

ను కూర్చుండి యాసనమున రాజును గూర్చుండఁ బె ట్టి తాను మహాశ్వేతను కౌఁగిలించి తన సఖియగు మదలేఖచేతఁ జంద్రాపీడునకుఁ బూజ చేయించెను. తరువాతఁ గాదంబరీచంద్రాపీడులకుఁ బరస్పరాను రాగ ముదయించెను. రాజు తాంబూలము పుచ్చు కొని కేయూరకునిచేఁ గనఁబర్చఁబడిన మార్గమునఁ గాదంబరి యంతఃపురమునకు వెళ్లెను. హంసియ ను నామాంతరముగల మహాశ్వేతయును, కాదంబ రి గలిదంద్రులయిన మదిరాచిత్రరథులఁ జూడఁగోరి లోనికి వెళ్లె. కాదంబరియుఁ దన మందిరంబునకు వె ళ్లెను. పిమ్మటఁ జంద్రాపీడునకు హేమకూటమును నివాసముగా గనుపఱుప నతఁడచ్చటనుండెను. అది మొదలు కాదంబరి చంద్రాపీడునియందుఁ మోహ వశంవదురాలయ్యె. రాజు నామెనే తలంచుకొను చుండెను. ఆమె రాజుదగ్గఱకుఁ దనసఖియగు మద లేఖను పంపి యతని మనస్సు తెలిసికొని తమాలికతో రాజుచెంతకు వెళ్లెను. అతనితో రెండుగడియలు

మాటలాడి తిరిగి యింటికి వచ్చెను. మఱునాఁడు చంద్రాపీడుఁడు కాదంబరితోను, మహాశ్వేతతోను చెప్పి సెలవు పుచ్చుకొని గుఱ్ఱమెక్కి కేయూరకుఁడు చెప్పినట్లు మహాశ్వేతాశ్రమమునకు వెళ్లెను. అచ్చట నింద్రాయుధమెక్కి కేయూరకాదులను మరలిపొమ్మని గుఱ్ఱపుడెక్కల జాడలఁ జూచుచు వచ్చి *పాళెమును బ్రవేశించెను. రాజుగారిని వైశంపాయనుఁడును, పత్రలేఖయు క్షేమసమాచారమడిగిరి. మహాశ్వేతను జూచుటను, గంధర్వనగరవిశేషంబులను, కాదంబరి సౌజన్యంబును, మదలేఖాతమాలికా కేయూరకాదుల వినయసంపదను జెప్పుచు నతఁ డారాత్రిఁ గడపె.

మఱునాటి ప్రొద్దుట హేమకూటమునుండి కేయూరకుఁడు వచ్చి కాదంబరి మోహితురాలై మిమ్ముఁ జూడగోరుచున్నదని చెప్పెను. పిమ్మట రాజు స్కంధావారమున వైశంపాయనుని నియోగించి,

*దండుదిగినచోటు.

ఇంద్రాయుధము నెక్కి పత్రలేఖతోను, కేయూర
కునితోను హేమకూటమునకు వెళ్లి హంసిని గౌర
వించి విరహతాపముచే హిమగృహమునందున్న కా
దంబరితో మాటలాడి నాటిరాత్రియుండి యామె
వినోదమునకా అకుఁ బత్రలేఖను విడిచి తిరిగి హేమకూ
టమునుండి పాళెము ప్రవేశించె. అపుడే తారాపీ
డునిచేఁ బంపఁబడ్డ దూతవచ్చి నమస్కరించి రెండు
త్తరములిచ్చెను. రాజువానిని విప్పిచదివి సమానా
ర్థముగల రెండవయుత్తరమును వైశంపాయనునకు ని
చ్చెను. అందులో "నాయనన్న నిన్నుఁ జూడఁగోరు
చున్నది. త్వరగారమ్ము" ని యున్నది. చంద్రాపీడుఁ
డు వెంటనే యింద్రాయుధము నెక్కి 'మిత్రుఁడా!
వైశంపాయనుఁడా! నీవు పత్రలేఖ రాకను జూచి
యామెతోఁ రమ్మ'ని వైశంపాయనుని స్కంధావార
మున నియోగించి స్వల్పపరివారముతో వెడలి రేయిం
బగళ్లు పెద్దయడవిలో వెళ్లుచు జరద్ద్రావిడధార్మికుఁ
డు వసించియున్న చండికాలయముంగని అక్కడ

రాత్రిఁగడిపియుదయమున మెల్లఁగా నుజ్జయినిఁజేరె
ను. తలిదండ్రులనమస్కరించి శుకనాసుఁడు మొదల
యినవారితో మాటలాడియంతఃపురముననివసించె.

కొన్నాళ్లకు వలాహక పుత్రుఁడైన మేఘనాదుఁ
డు పత్రలేఖను దీసికొనివచ్చి చంద్రాపీడునకు నొ
ప్పగించెను. రాజు సంతోషించి చూపుచే మేఘనా
దుని గౌరవించి యతని విడిచి పత్రలేఖ నాదరించి
యామెతో రహస్యమునఁ గూర్చుండి మహాశ్వేతా
కాదంబరుల కుశలవార్త చెప్పుమన దేవా! నీవువిడి
చివచ్చినది మొదలు నిన్నే తలంచుచు మోహపరవ
శురాలనయిన నన్నొకనాఁడు చెయ్యిపట్టుకొనికన్ని
ళ్లుజాఱవిడుచుచు రాజును రాపించు నుపాయము
నీవే యెఱుఁగుదువు. రావలసినదని నేనుబలాత్క
రించి వర్తమానము చేయుట సరిగానుండదు. నేను జ
నిపోవుటయును సరికాదని కాదంబరి యిట్లు చెప్పె.

పూర్వభాగము సమాప్తము.

ఉత్తర కాదంబరి.

---

ఓ పత్రలేఖా! నీచేత రాజకుమారుఁ డొకపుడు తీసికొని రాఁబడెన నతనియెమలు సెలువఁబడుటకు నీగ్గు పడుమును. అతఁడు జన్మభూమిని కార్యములను విడిచి తిరిగివచ్చుట యయుక్తమని చెప్పి తర్కించుచుఁ గాదంబరియూరకుండెను. నేనాపె దుఃఖమును జూచి మనస్సుకరఁగి యామెనూరడించి- ఓ కాదంబరి! నీవు విచారింపకుము. నేనచ్చటికి వెళ్లి చంద్రాపీడుని రాపించెదనని చెప్పితిని. రాజాసంగతి విని కాదంబరీలగ్నచేతస్కుఁడయ్యెను. అంతఃపురమునుండి ప్రతీహారివచ్చి ఆర్యా! అమ్మగారు పత్రలేఖను,తమ్మును జూడఁగోరినారని చెప్పఁ బత్రలేఖయు దానును దల్లిచెంతకు వెళ్లి తల్లిచే బుజ్జగింపఁబడినవాఁడయి కాదంబరినే స్మరించుచు దుఃఖముచేఁ గొన్నిదినములు గడిపి యొకనాఁడు శిప్రానదీతీరంబునకుఁ బత్రలేఖతో రాజు వచ్చి హేమకూటమును

జూచుచుండ నమస్కరించుచు వచ్చి సమీపించిన కేయూరకునిఁజూచి కౌఁగిలించుకొని,అతనివలనఁ గాదంబరీవృత్తాంతమును విని హేమకూటమునకు వెళ్లఁదలంచె. పిదప దశపురంబువలను సైన్యమువచ్చిన సంగతి రాజువిని సంతసించి 'ఓపత్రలేఖా! నీవు కేయూరకునితో హేమకూటమునకు నిర్గమించి యచ్చట కాదంబరి నోదార్పుము. నేను శిబిరముతో వచ్చి వైశంపాయనునిఁజూచి యతనితో నాలోచించి వచ్చెద'నని పలికె. మేఘనాదునితోఁ బత్రలేఖను హేమకూటమునకుఁ దీసికొని వెళ్లుమన నందఱును బయలుదేఱిరి. రాజెప్పుడు కాదంబరీ వైశంపాయనులను జూచెదనని చింతించుచు మఱునాఁడు జననీజనకశుకనాసులయాజ్ఞనొంది యింద్రాయుధ మెక్కి పరిమితపరిజనంబుతో నిర్గమించి. త్వరలో స్కంధావారంబుచేరె. అచ్చట వైశంపాయనుని గానక నతఁడేడీయని వలాహకునినడుగ నతఁడచ్ఛోదంబునకు వెళ్లి విపినంబులలోను, దేవతాస్థానములలో

ను దిరుగుచు జన్మభూమిని మమ్మును దలిదండ్రులను
మఱచిపోయెను. మేము పెక్కువిధంబుల బోధించిన
ను బ్రత్యుత్తరమియ్యకుండె. రమ్మని బలాత్కరింప
మీరు సైన్యముఁదీసికొని యుజ్జయినికిఁ బొండనియు,
నామనస్సు విరక్తిగనున్నదనియు, ఇచ్చట సంచరిం
పనిష్టమగుచున్నదనియు, మాఱుల బలాత్కరించిన
చోఁ బ్రాణములవిడిచెదననియుఁ జెప్ప నిరాశచేసి
కొని వచ్చితిమని పలికిరి.

చంద్రాపీడుఁ డామాటలకు మూర్ఛిల్లి కొంత
సేపటికిఁ దెలివి తెచ్చుకొని తారాపీడశుకనాసులు
వానిరావింప నుపాయ మెఱింగినవారని దండుతో
నుజ్జయినికి నేగెను. శుకనాసుఁడు వైశంపాయనుని
వృత్తాంతంబు నతనివలన విని మనోరమయు, దా
ను నేడ్వసాగెను. తారాపీడ చంద్రాపీడులు శుక
నాసు నోదార్చిరి. చంద్రాపీడుఁ డాదంపతులయే
డుపు వినలేక ఓగురుజనమా! సెలవిచ్చినయెడల వై
శంపాయనుని దీసికొనివచ్చెదనని పలికెను. ఆమా

టకు శుకనాసతారాపీడులులోనగు వారంగీకరించి
రి. చంద్రాపీడుఁడు గురుజనంబునకు నమస్కరించి
తారంగిక పరివారముతో బయలుదేరెను. అతఁడు
వెళ్లుచుండ వర్షము తటస్థించెను. తడియుచునే పయ
నంబు సేయుచు హేమకూటము నుండి వచ్చుచు
న్న మేఘనాదునిఁ జూచి ప్రియాస్పదురాలగు ప
త్రలేఖ క్షేమవార్త నడుగకయె వైశంపాయనుని
కుశలం బడిగె.

మేఘనాదుఁడు 'ఓస్వామీ! వైశంపాయనుఁడు
మనలను విడిచి యచ్ఛోదసరస్తీరంబున వెఱ్ఱివాఁ
డై తిరుగుచున్నాఁడు- పని చేయుమ'నెను. రాజ
తని మైత్రిచే నచ్ఛోదసరస్తీరంబునకు వెళ్లి వెదకి కా
నక మహాశ్వేతాశ్రమంబునకు వెళ్లి దుఃఖితురాల
గు నామె దుఃఖకారణము నడిగె.

ఆమె దుఃఖము నణఁచుకొని 'ఓ రాజా! నేను కా
దంబరి దగ్గఱనుండివచ్చి నాగుహఁజేరి పుండరీకుని
ధ్యానించి తపమాచరించుచుండ నీవంటి బ్రాహ్మణుఁ

డువచ్చి నన్నుఁజూచి మోహించి నావంక జూడఁద రలికను బిలిచి యామార్గస్థుని వారింపుమంటిని. నాపి మ్మటఁ జంద్రుఁడుదయింపన కామపీడితుఁడు నన్నా లింగింపరాఁగా నోరిపాపీ! ఆయువుతగ్గ చిలుకకడు పునఁబుట్టుమని శపించితిని. వాఁడు వెంటనె పడిచ చ్చెను. వానితోనున్నవారు నీమిత్రుని మిత్రుఁడని చెప్ప నేడ్చి క్రిందఁబడితిననె. ఇట్లు మహాశ్వేతవలన వైశంపాయనుని చావు తెలిసికొని చంద్రాపీడుఁ డు క్రిందఁబడి యేడ్చి ప్రాణములు విడిచెను.

ఇదియిట్లుండ చైత్రరథి హేమకూటంబునఁబత్రలే ఖవలన రాజుగాక తెలిసి మదలేఖాపత్రలేఖలతోఁ గ లసి యచ్ఛోదసరస్తీరంబునకువచ్చి యట్టియవస్థను న్నరాజును జూచి మదలేఖయు, బత్రలేఖయు, రాజై న చంద్రాపీడుని పరిజనంబును నేడ్వసాగిరి. కా దంబరి సహగమనము చేయఁదలఁచి మహాశ్వేతను, సఖీజనంబును, సెలవడిగి చంద్రాపీడుని పాదముల ను దొడపై నిడుకొని దుఃఖించుచుండె. అపుడు చం

ద్రాపీడునిలోనుండి యొక తేజము చంద్రమండల
ములోనికి బయలు వెడలెను. 'ఓమహాశ్వేతా! పుండ
రీకునితో నీకు సమాగమంబు గలుగునని మున్నె చెప్పి
తిని. కాదంబరికిని జంద్రాపీడునకును సమాగమంబు
గును గనుక నతని శరీరంబును దహింపక కాపాడ
వలసినది. శాపము చేసినట్లు జరిగె' ననెడి యశరీరవాక్కు
వినఁబడెను. అంతఁ బత్రలేఖ యింద్రాయుధమును
దోలుకొని చంద్రాపీడుఁడు లేనిది యిచ్చటనుండుట
యనవసరంబని యాగుఱ్ఱముతో దాను నచ్ఛోదస
రస్సున మునిగిపోయెను. వెంటనె యా సరస్సులో
నుండి పుండరీకుని మిత్రుఁడగు కపింజలుఁడు గట్టున
కువచ్చెను. మహాశ్వేత యతనింజూచి యానవాలు
వట్టి ఓకపింజలుఁడా! యెక్కడకుఁబోతివి? పుండరీ
కుని వృత్తాంతమేమి? యని యడిగెను. అతఁడు,
ఓమహాశ్వేతా! దుఃఖించుచున్న నిన్నువిడచి పుం
డరీక దేహము తీసికొని పోవుచున్న దివ్యపురుషుని
వెంబడించి చంద్రలోకమునకు వెళ్లఁ జంద్రుఁడు క

పింజలునితో నిట్లనెను. ఓకపింజలుఁడా! నేను జం
ద్రుఁడను- నాకిరణములచే సంతప్తుఁడై పుండరీకుఁ
డు ప్రాణములు విడుచుకాలమున 'చంద్రుఁడా!
నావలెనీవును ప్రియురాలితో సమాగంబు లేక వ్య
తి నొందెదవుగాత'మని నన్ను శపింప నేనును గో
పించి నీవును నాతో సమానముగా దుఃఖ మనుభ
వింతువుగాత మని శపించితిని. శాప మగువలనఁ
బుండరీకుని శరీరంబు నాచే రక్షింపఁబడును. తరు
వాతఁ బుండరీకుఁడు తిరిగి మహాశ్వేతను పెండ్లి
యాడి సౌఖ్యము నొందునని చెప్పెను. ఈవృత్తాం
తంబును నేను విని శ్వేతకేతుతోఁ జెప్ప నాకసం
బున వెళ్లుచుండఁ దెలివిలేమి నొక వైమానికు ను
ల్లంఘించితిని. అతఁడు కోపించి పరిగెత్తెడు గుఱ్ఱమ
వుదువుగాక యని నన్ను శపించె. నేను సముద్ర
మునఁబడి పూర్వజన్మజ్ఞానముతో సంద్రాయుధను,
ను గుఱ్ఱము నయితిని. చంద్రుఁడు చంద్రాపీడుఁడు
గాను, పుండరీకుఁడు వైశంపాయనుఁడుగా నయి

రి. నేను బూర్వజ్ఞానముహీనముచేఁజంద్రాపీడుని మో
యుచు శాపవిమోచనమునకై యిచ్చ్టటుఁదీసికొ
నివచ్చి యచ్ఛోదసరస్సునందలి జలస్నానముచేత
శాపవిముక్తుఁడనై యిప్పుడు నిజరూపము నొందితిని.
నీవును బుండరీకుని గలసి వర్ధిల్లుము. శ్వేతకేతు
వునకు నీవృత్తాంతము చెప్ప నాకు సెలవిమ్మని కపిం
జలుఁడు బయలుదేఱెను.

పిమ్మటఁ గాదంబరియును, మహాశ్వేతయును, జం
ద్రాపీడుని పరిజనంబును, జంద్రాపీడుని శరీరమును
గాపాడుచుండిరి. కాదంబరి యాజ్ఞచేఁ జంద్రాపీ
డుని యనుచరుఁడగు త్వరితకుఁ డుజ్జయినికి వెళ్లి తా
రాపీడునకును శుకనాసునకును జరిగినదంతయుఁ
జెప్పెను. అందుమీఁద రాజమంత్రులు తమ భార్య
లగు విలాసవతీ మనోరమలను దోడుకొని యచ్ఛో
దసరమునకువచ్చి కాదంబరి నోదార్చి చంద్రాపీ
డుని బట్టుకొని యందఱు నేడ్చి చంద్రాపీడవైశం
పాయనులు పునర్జీవితులగుదురనియాశతో నుండిరి.

జాబాలిమహర్షి యిట్లు మునులతో బృహత్కథంజె
ప్పె. ఋషులు దానివిని యాశ్చర్యము నొందిరి. క
థాసమాప్తి కాఁగానే నాకుఁ బూర్వజన్మజ్ఞానము
కలిగి మనుపటివలె సకలవిద్యలయందు బాండిత్యము
కలిగెను. పిమ్మట నామిత్రుఁడగు కపింజలుఁడు గగ
నమార్గమునుండి డిగ్గి జాబాలి యాశ్రమము ప్రవే
శించి శుకమునైయున్న నన్నుఁ జూచి శ్వేతకేతు స
న్నిధికి వెళ్లె.

నేను హారీతుచేఁ బెంపఁబడి ఱెక్కలువచ్చి ప్రా
ద్దుటనే యుత్తరదిక్కునకు గగనమార్గమున కెగిరి
వెళ్లుచు నడవులను సరస్సులను దాటుచు నెప్పుడు
కాదంబరీ సఖియగు మహాశ్వేత నచ్ఛోదసరస్తీర
మునఁ జూచెదనని పూర్వసంస్కారము వలన వే
యివిధములఁ దలంచుచు మధ్యాహ్నమున క్షుత్పి
పాసలచేఁ బీడింపఁబడుచు నొకయరణ్యమునఁ జె
ట్టుక్రింద డిగ్గి తగిన మేతమేసి యచ్చటనే పవ్వళిం
చితిని. ఆసమయంబుననే యొకఁడు బంధనముల

తోవచ్చి నన్ను బంధించి చేతఁబట్టుకొనగా 'నీవె
వఁడవు? పలనన్నుఁ బట్టితి' వని యడుగ నతఁడు ఓ
పక్షిరాజా! యిచ్చటకి సమీపమున మా శబరరాజు
న్నాఁడు. అతని పుత్రిక జాబాలి యాశ్రమమున నీ
వంటి పక్షిగలదనియు, నది యిప్పు డెగిరి పోయినదని
యు, విని దానిం బట్టఁ బెక్కండ్రు శబరులకు నా
జ్ఞాపించెను. నాపుణ్యమునుబట్టి నీవు నా చేత జిక్కి
తివి. చండాల కన్యకు నిన్ను నిచ్చి మెప్పు నొందుదు
ను. అది నిన్ను విడువఁగట్ట సమర్థురాలని నన్నుఁ బ
కరుణమునకుఁ దీసికొని వెళ్లి చండాల పుత్రికకు ని
చ్చెను. అది నన్నుఁ జర్మమయపంజరములో నుంచి
'ఓయిమరాచారుఁడా! యిది తండ్రిమాట జవదాఁ
టిన ఫల'మని యూరకుండె. నేను తిండికుడుపులను
మాని మౌనముగానుండి పాపిష్ఠమగు శరీరమును
విడిచి పెట్టదలఁచి యుండఁ జాండాలి నాకు మేఁత
బెట్టి తినుమని పొడిచినను జీత్కరించితిని. అంత నది
'షండేలతినవు? నీ రేల త్రాగవు? మాలవాని నీరయి

నను నేలపడ్డపుడు పవిత్రమగును. సందేహించు దానవైన యెడల నిట్టిదుర్దశ నేలపొందితివి? తరువాత విచారపడకుండునట్లు మొదట ప్రవర్తింపవలయు' ననెను. చాండాలి వాక్యము ప్రమాణముగాఁ దలఁచి ఫలాదులను దిని యుండ నాకు నీశ్వరానుగ్రహము గలిగె. ఒక నాఁటి యుదయమున నాపక్కణమంతయు స్వర్గతుల్యముగను, శబరులందఱు దివ్యపురుషులుగను, ఈచర్మపంజరము స్వర్ణమయముగనాయె. అపుడు నేను విస్మయము నొంది యీవిచిత్రము విచారించుచుండఁగాఁ జండాలపుత్రి పంజరముతో నన్ను మీసన్నిధికిఁ దీసికొని వచ్చెను. ఇంతవఱకు నాకుఁ దెలియును. తక్కిన సంగతి యీచాండాలిని నీవు తెలిసికొనుము నేనును వినఁగోరెదనని వైశంపాయనశుక మూరకుండెను.

పదంపడి శూద్రక మహారాజు నీవిచ్చటకు వచ్చిన కారణమేమని దాని నడుగ నది 'ఓయిరోహిణీవల్లభా! చంద్రా! కాదంబరీ ప్రాణనాథా! చంద్రాపీ

ఢా ! అనిపిలిచి యిట్లు చెప్పఁదొడఁగె. నేను శ్రీని (పద్మవనలక్ష్మిని) ఈశుకము శుకనాస పుత్రుఁడగు వైశంపాయనుఁడు- శ్వేతకేతువునకును శ్రీయను నామాంతరముగల లక్ష్మికిని పుట్టినవాఁడే పుండరీకుఁడు. వైశంపాయన పుత్రుఁడే యీశుకమై యిది యంతయు నీతోఁ జెప్పియే యున్నాఁడు. ఇతఁడు చపలచిత్తుఁడు. కామపరవశుఁడై పుండరీకదేహమును విడిచి రెండు జన్మములెత్తెను. ఈజన్మమునందుఁగూడ నవినయము చేసినయెడల నింతకంటె నధోగతి నొందునని, తండ్రియగు శ్వేతకేతు నియోగముచేతఁ బంజరమున బంధించి యింతకాలము వీని రక్షించితిని. ఇప్పుడు మీయిద్దఱికిని శాపవిమోచనసమయము తటస్థించె. కనుక జరామరణ భూయిష్ఠమగు మానవదేహంబును విడిచి దివ్యదేహంబును ధరించి కాదంబరితోను, మహాశ్వేతతోను జిరకాల సౌఖ్యముమీయిద్దఱనుభవింప వలయునని దీని మీచెంతకుఁ దెచ్చితి' నని పలికి నంవటి యెమట గగనమార్గమున

మెఱుపువలె మెఱయుచు నా చాండాలి వెళ్లిపోయె
ను. అది పోఁగానే శూద్రకుఁడు కాదంబరియందు
మోహపరవశత నొంది వెంటనే కాలధర్మము నొం
దెను. అట్లె వైశంపాయనుఁడును మహాశ్వేతను
మోహించినవాఁడై పంచత్వము నొందెను.

అంత నచ్ఛోదసరస్తీరమునఁ గాదంబరి వసంత
శోభచే మదనవేదన నోర్వఁజాలక మహాశ్వేతను,
మదలేఖను, కనుగప్పి చైతన్యములేని చంద్రాపీడశ
రీరమును గట్టిగఁ గౌఁగలించుకొనెను. అమృతముప
లనఁ బుట్టిన యప్సరఃకులమున జన్మించిన కాదంబరి
శరీరస్పర్శచే నిద్రనుండి లేచి నట్లతఁడు బ్రతికెను. పుం
డరీకుఁడు నభోమార్గమునుండి కపింజలునితో నచ్చ
టికి వచ్చెను. లజ్జాళువైన మహాశ్వేతయును బుండ
రీకుఁడును సంతోషముచే నొండొరుల గౌఁగిలించు
కొనిరి. ఈవృత్తాంతంబంతయుఁ బరిజనము వలన వి
ని దంపతులగు విలాసవతీ తారాపీడులును, మనో
రమా శుకనాసులును, మదిరా చిత్రరథులును, గౌరీ

హంసులు నచ్చటికి వచ్చిరి. అంతలోఁ గపింజలుఁడు 'ఓశుకనాసుఁడా! శ్వేతకేతువు నిన్నుఁగూర్చి యిట్లువలికె. నావలన పుండరీకుఁడు పుట్టినను నీయందలి స్నేహముచే నన్నుఁ జూడకయే నీచెంతకు వచ్చెను. ఇంతియేకాక మఱియొక జన్మమునొంది వైశంపాయన జన్మంబున నీకుఁ బుత్రుండయ్యె. కానఁ గ్రొత్తకోడలయిన మహాశ్వేతతో నతఁడు నీయొద్దనే యుండఁదగినవాఁడు. నీవు చిరంకాల మట్టి పుత్ర సౌఖ్య మనుభవింపుము. ఆసంగతి విని యంమలకు శుకనాసుఁడు మిగుల సంతసించె. పిమ్మటఁ గాదంబరీ చంద్రాపీడులకును, మహాశ్వేతా పుండరీకులకును, అచ్చటనే వివాహమయ్యె. పిమ్మటఁ జిత్రరథుఁడు చంద్రాపీడుని బంధుగులతోఁ దన యింటికిఁ దీసికొని వెళ్లి గంధర్వరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁగాఁ జేసెను. హంసుఁడుకూడఁ బుండరీకునకుఁ దనరాజ్యము నభిషేకము చేసెను.

పిమ్మటఁ గాదంబరి రహస్యమునఁ జంద్రాపీడు

నిఁజూచి 'ఓప్రియుఁడా! దైవయోగముచేఁ బునర్జీవితులమయితిమి గాని పత్రలేఖ యెచ్చటను గనఁబడదేమి? ఆదీనురాలిప్పు డెచ్చటనుండును? ఆర్యపుత్రా! చెప్పు'మని యడిగెను. అంతనకుఁ జంద్రాపీడుఁడు 'ఓసుందరీ! శాపముచే మనుష్యలోకమున జన్మించిన చంద్రుఁడనయిన నాకు సేవకై రోహిణీ పత్రలేఖగా జన్మించి యిప్పుడు శాపవిముక్తి సమయమని తెలిసికొని యచ్ఛోద సరస్సునందు స్నానముచేసి దివ్యదేహమును ధరించి తిరిగి రోహిణియై చంద్రలోకమున నన్నుఁగూర్చి నిరీక్షించుచున్నది. అచ్చటకామె నూరడించుటకు మనము వెళ్లవలసియున్నది' యనిచెప్పె.

పిమ్మటఁ జంద్రాపీడపుండరీకులు కాదంబరీ మహాశ్వేతలతోఁగూడి సౌఖ్యము ననుభవించుచు హేమకూటమున నత్తవారింటఁ బది దినముల నొకదినముగాఁ గడిపిరి. చంద్రాపీడుఁ డత్తమామలయిన మదిరాచిత్రరథుల దగ్గఱ సెలవు పుచ్చుకొని తండ్రియ

గు తారాపీడుని సన్నిధానమునకు వచ్చెను.

పిమ్మట మిత్రుఁడైన పుండరీకునియందు రాజ్యభార మునిచి పితృగౌరవముఁ బట్టి యుజ్జయినియందును, ఒకపుడు గంధర్వలోకమునందును, రోహిణీప్రీతిచేఁ జంద్రలోకమునందును, పుండరీక ప్రీతిఁబట్టి లక్ష్మీవాసస్థానములగు నుద్యానములయందును, కాదంబరికి నిష్టములగు ప్రతిస్థలమునందు నామెతో విహరించుచుండె. పెక్కులేల. కాదంబరీ చంద్రాపీడులును, మహాశ్వేతా పుండరీకులును, పుండరీక చంద్రాపీడులును, మహాశ్వేతా కాదంబరులు నొండొరుల విడమిచే నందఱు సర్వసౌఖ్యముల నొందుచు నానందకోటి నొందిరి.



# నోటీసు.

---

| | | |
|---|---|---|
| ప్రథమోపదేశము. | ... | రు ౦-౩-౬ |
| అగణితము. | ... ... | రు ౦-౪-౬ |
| ఆశౌచసారము. | ... ... | రు ౦-౫-౬ |
| ఆంధ్రోపనిషత్తులు ౬. ౧ భాగము. | | రు ౦-౮-౦ |
| ఆంధ్రోపనిషత్తు ౨ భాగము. | | రు ౦-౮-౦ |
| సాంఖ్యచంద్రాలోకము. | ... | రు ౦-౪-౬ |
| ఎక్సరుసైజు సంస్కృతము ఇంగ్లీషు. | | రు ౦ [illegible]-౬ |
| కాదంబరీకథాసారము తెలుఁగుగద్యము. | | రు ౦-౨-౬ |
| విగ్రహవర్ణము (సమాసము) | ... | రు ౦-౨-౬ |

ఈపుస్తకములు పోస్టేజీసహా ఈ నెలలకు నాయొద్దను, యస్. యస్. యమ్. ప్రెస్ బుక్కుడిపోలోను, బి. రామయ్య అండ్ కో వారివద్దను దొరకును.

విశాఖపట్టణము.
1-12-1904

చేవ్వలి సుబ్రహ్మణ్యశాస్త్రి,
సంస్కృతపండితుఁడు,
లండన్ మిషన్ హైస్కూల్.

